గీ. డెఱ్ఱనార్యుఁడు సకలలో • కైకవిదితుఁ
డయిన నన్నయభట్ట మ • హాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్ర • శస్తిదన్నుఁ
జెందుటయు సాధుజన హర్ష • సిద్ధిఁగోరి.

క. ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతదోఁపఁ • దద్రచనయ కా
నారణ్య పర్వశేషము
పూరించెఁ గవీంద్ర కర్ణ • పుటపేయముగాన్.

పై పద్యములలో
"తత్కవితారీతియుఁ గొంతదోఁపఁ దద్రచనయ కా
నారణ్య పర్వశేషము పూరించెన్"

అను వాక్యముచే 'ఎఱ్ఱనార్యునకు నన్నయ రచించి క్రిమినష్టమైపోయిన భాగములోఁ గొంతదోఁప (అనగాఁ గొంతభాగము కాన్పింపఁగా) ఆ నన్నయపేరితోనె పూరించెను (పూర్తి చేసెను) అని యర్థ మగుచున్నది గాన నెఱ్ఱన స్వంతకవిత్వముఁ జెప్పక నడిమిభాగములనే పూర్తిఁజేసె నందురు.

ఇట్టి విపరీతవాదముఁ జేయువారు 'ఆరణ్యపర్వశేషము' అనువాక్యములోని శేషశబ్దమున కర్థమును విచారించి యుండరు. శేషమును బూర్తి చేసెనన లుప్తభాగములను బూర్తి చేసెనని యెట్లర్థమగును ? మఱియు నరణ్యపర్వశేషముఁ జెప్పుటచేనె యాతనికి 'ప్రబంధ పరమేశ్వర' బిరుదము లభించినట్లాతఁ

డె నరసింహాపురాణమునఁ జెప్పికొనియున్నాఁడు. గ్రంథముల
గొన్ని కొన్ని పద్యములయొక్కయు, వచనముల యొక్క
భాగములను మాత్రము పూర్తి చేసినంతమాత్రమున నె
ప్రసిద్ధమగు బిరుదు లభించునా? నన్నయయొక్క 'సరస
స్వత ప్రశస్తి' తన్నుఁ జెందుట, తత్కవితారీతి తనకుఁ దో
ట, యనుదాని వలన నన్నయయొక్క వాఙ్మయాంశములు,
ని కవిత్వపద్ధతియుఁ దనకు నలవడె నని యర్థముకాని చెడిపో
కొన్నిపద్యములుగల తాటాకులని యెచటను నర్థముకాదు.

మఱియు నెఱ్ఱన యరణ్యపర్వభాగములోని కవిత్వ
కిని 'నన్నయ, తిక్కనల' కవిత్వశైలికిని భేదము స్పష్టమగు
దును. కొన్నియెడల నన్నయ యొక్కయు, మఱికొన్ని యె
తిక్కనయొక్కయు, శైలి ననుకరించియు, విపులీకరించియు
ఱ్ఱన రచించియున్నాఁడు. ఆయంశము ముందు వ్రాయఁబడు
మఱియు భారతారణ్య పర్వశేషములోని యెఱ్ఱన శైలి య
ని 'హరివంశ, నరసింహాపురాణములలోఁ' గూడఁ బ్రతిఫలి
చుండును. వాని నట్టిదృష్టితోఁ జదివినవారికి విశదముకాఁగల

మఱికొందఱు 'ఎఱ్ఱన' తానురచించిన యరణ్యపర్వ
గమును, నన్నయపేరితోనె, రాజనరేంద్రున కంకితము
రచించుట యెట్టిదందురు. ఎఱ్ఱనకుఁ దత్కాలమున— ఆకాల
ననేకాదు— నేఁడును నన్నయభట్టు వనపర్వశేషము నా
రించుచుండ బెడిసికొట్టి మతిపోయి మృతినొందె నను ప్ర

ము లోకమున నుండుటచేఁ దా నాంధ్రీకరించినను,తనపేరితో నుండకుండిన నాకీడు తనకుసంభవింపక పోవచ్చు ననియె యట్లు సాహసము చేసియున్నాఁడని తలంపవలసి యున్నది. ఇందు 'తిక్కన మహాకవి' కంటె నీతఁడె చౌరవచేసి యరణ్యపర్వశేషము నాంధ్రీకరించి ఖ్యాతినొందె నని చెప్పవలెను. లోకపరివాద మొంతటి ధీరునైన భీరువుఁ జేయుఁగదా! అంతియెకాని నన్నయపేరితో నెఱ్ఱనయాంధ్రీకరించుటకు వేఱుకారణములేదు.

ఈనడుమ నొకరు తిక్కన కాలమునకు నన్నయకృతమైన యరణ్యపర్వము సంపూర్ణముగా నుండుటచేతనే యాతఁడు విరాటపర్వముమొదలుకొని యాంధ్రీకరించెనుగాని, లేకుండిన నరణ్యపర్వశేషముఁ బూరించుటలో జడియువాఁడుకాఁడని వ్రాసియున్నారు.

కాని, తిక్కనమహాకవియు సాంఘికప్రవాదమునకు సందేహించువాఁడె యనుటకు నాతఁడు రచించిన 'నిర్వచనోత్తరరామాయణము' లోని రామనిర్యాణఘట్టము నాంధ్రీకరింపక విడుచుటయే మఱియొక నిదర్శనము. శ్రీరామనిర్యాణముఁ జెప్పిన, నేదేనికీడు మూఁడు ననియే యట్లు చేసియున్నాఁడు. *

ఇంతమాత్రమె కాదు, తిక్కనమహాకవి తత్కాలమున స్వదేశమునందు విజృంభించియున్న జైనమతమునకు వ్యతిరేక

* తిక్కనకవి విడిచిన రామనిర్యాణఘట్టగాథను 'జయంతి రామభట్టు' అను నొకకవి యిటీవల నాంధ్రీకరించియున్నాఁడు.

ముగా నుండిన మహాభారతములోని కొన్నియంశములను ...
చియుఁ గొన్నిటిని 'తాఱుమాఱు' చేసియుఁ గొన్నిటిని పెం...
యు నాంధ్రీకరించియున్నాఁడు. *

తిక్కనసోమయాజియె కాఁడు, ఆతనికి 'దశకుమార...
రిత్ర'ను గృతినిచ్చిన 'కేతనమహాకవి' యుఁ దా నాంధ్రీక...
చిన 'విజ్ఞానేశ్వరీయము' లోఁ దత్కాలాచారములకు వ్యతి...
ముగా నుండినయంశములఁ ద్యజించియున్నాఁడు. ♦

గృహస్థు లగు 'తిక్కన, కేతన' మహాకవులె కారు-వా...
కాలముననె యుండినసన్యాసి యగు 'మధ్వాచారి'యు (ఆన...
తీర్థులు) తానువ్రాసిన 'బ్రహ్మసూత్రభాష్యాంశము'నకు వ్యతి...
ముగానె తా నుండినప్రదేశమునఁ గల జైనమతమునకుఁ బుం...
లోఁడి కర్మములఁ జేయించియున్నాఁడు. ‡

---

*తిక్కనమహాకవి భారతము నాంధ్రీకరించుటలో నేయంశము...
ద్యజించెనో, వేనిని 'దాఱుమాఱు' చేసెనో, వేనిఁ బెంచెనో ము...
వ్రాయఁబడును.

♦ కేతన "విజ్ఞానేశ్వరీయము" నాంధ్రీకరించుటలో, సర్వశ్రో...
సమ్మతమగు 'గోమధుపర్క' విషయికాంశములఁ జెప్పు 'మహోక్షం ...
మహాజం వా, శ్రోత్రియాయ ప్రకల్పయేత్" మొదలగుశ్లోకములను నా...
నెల్లూరు, ప్రాంతమున విజృంభించిన జైనమతమునకు వ్యతిరేకమని సంకో...
చియే తెలిఁగింపక విడిచియున్నాఁడు. 31—1—25.

‡ మధ్వాచారి తనబ్రహ్మసూత్రభాష్యమున 'శంకర, రామాను...
భాష్యములను మించుటకో యన, యజ్ఞపశువిశసనమును విధించుచు—
నూ॥ అశుద్ధ మితి చేన్న శబ్దాత్॥ 3-1-25

ఏమహాకవియైనను—ఏమహాయోగియైనను—తత్తద్దేశకాల పరిస్థితులను దాఁటుటకు సంకోచించినవాఁ డనిన, దానిని వారి లోప మన రాదు. అది లోకస్వభావమే.

అగుఁగాని, 'తిక్కన, మారన, అప్పకవ్యా'దులు నన్నయ మూఁడుపర్వములఁ దెనిఁగించెనని చెప్పెడి యంశమునకు గతి యేమందురు?

ఆయంశము నిట్లు సమన్వయించుకొనవలసి యుండును.

నన్నయమహాకవి సంస్కృతభారతములోని 'వన' పర్వము యొక్క మూఁడువందల పదునాలు గధ్యాయములలోను(314) నూఁట యెనుబ దాఱధ్యాయములను(186) పదమూఁడువందల (1300) పద్యగద్యములనుగా నాంధ్రీకరించెను. శేషించిన నూఁట యిరువదెనిమిది యధ్యాయములను(128) ఎఱ్ఱాప్రగ్గడ మహాకవి పదునాఱువందల(1600) పద్యగద్యములనుగా నాంధ్రీకరించి యున్నాఁడు. ఇందు నన్నయయాంధ్రీకరణభాగము, సంస్కృతభా

---

అను సూత్రమునకు భాష్యమును పురాణముచేఁగూడ యజ్ఞమునఁ బశుహింస చేయవలసినదే యని సోదాహరణముగా దృఢపఱచియు, స్వస్థల మగు 'ఉడిపి' ప్రాంతమునఁ దనయాజమాన్యమునఁ జేయఁబడిన యజ్ఞముఁ బశువును విశసింపక, 'పిష్ట' పశువు నుపయోగించియే చేయించియున్నాఁడు. అదియే నాఁటినుండి నేఁటివఱకు మధ్వమతస్థుల కాచారమైనది. మధ్వాచారి తత్ప్రదేశమునఁ దత్కాలమునఁ బ్రబలముగా నుండిన జైనమతమునకు లోఁగియె యట్లు చేసె ననవలసియున్నది. ఆతఁడు బ్రహ్మసూత్రభాష్యము నార్యావర్తమున రచించెను.

రతముయొక్క వనపర్వములో సగముకంటె నెక్కువయై, తె
గున నాతని సభాపర్వముకంటె రెట్టింపై, తిక్కనమహాకవి
క్క 'భీష్మ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, అశ్వమేధ, ఆశ్రమవా
స, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ' పర్వభాగము
లెను పెద్ద దగుటచేతను, తిక్కనాదిమహాకవు లద్దాని నొక
ముగానె పరిగణించిరి.

ఎఱ్ఱాప్రెగ్గడకవి రచించిన వనపర్వశేష మన్ననో,
స్కృత వనపర్వమున నూఁటయిరువదెనిమిది (128) యధ్యా
ములుమాత్రమె కల్గియున్నను, తెనుఁగున నన్నయ రచి
యరణ్యపర్వభాగముకంటె నెక్కు డగుటయె కాక, తిక్క
రచించిన భారతభాగములో 'ద్రోణ, శాంతి, అనుశాసన
పర్వములు కాక తక్కిన పర్వములకంటెఁ బెద్దదై పదునా
దల(1600) పద్యగద్యములు కలదిగా నున్నది. వనపర్వాం
ణములో నన్నయమూలమును సంక్షేపించి యాంధ్రీకరించి
ను, ఎఱ్ఱన, విపులీకరించి ప్రబంధధోరణి నాంధ్రీకరించిన
తోఁచెడిని. దాని నింకను బరిశోధింపవలయును.

కాన నెఱ్ఱనామాత్యుని వనపర్వాంధ్రీకరణభాగము
ముకాక, యాతఁడు ప్రబంధపరమేశ్వరబిరుద మొందు
దగిన పెద్దదగుగ్రంథముగానె పరిగణింపఁ దగియున్నది. *

---

* చదువరుల యుపయోగముకై భారతపర్వములలోని పద్య
సంఖ్యక్రింద వ్రాయఁబడెను.

ప్రసిద్ధి కెక్కిన మను, వసుచరిత్రలకంటెను ఎఱ్ఱన యరణ్యపర్వము పెద్దది.

అందువలననె ప్రాచీనమహాకవులు 'ఎఱ్ఱాప్రగ్గడ' మహాకవిని భారతాంధ్రీకర్తలలో నొకనిగాను, మహాకవినిగాను పరిగణించిరి. ఇంతమాత్రమె కాదు, ఆంధ్రవాఙ్మయసృష్టిలోఁ బ్రధానులగు 'నన్నయ, తిక్కన' మహాకవులతోఁ గలిపి నుతించిరి.

అట్లు నుతించినమహాకవుల కొందఱి వాక్యములఁ జూడుఁడు.

శ్రీ నా థ మ హా క వి.

సీ. వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు

| పర్వములు—పద్యగద్యసంఖ్య. | | పర్వములు—పద్యగద్యసంఖ్య. | |
|---|---|---|---|
| (1) ఆదిపర్వము— | 2091 | (9) శల్యపర్వము- | 829 |
| (2) సభాపర్వము — | 618 | (10) సౌప్తికపర్వము- | 376 |
| (3) అరణ్యపర్వము | | (11) స్త్రీపర్వము- | 377 |
| (A) నన్నయ | 1300 | (12) శాంతిపర్వము- | 3099 |
| (B) ఎఱ్ఱన | 1600 | (13) అనుశాసనికపర్వము- | 2148 |
| (4) విరాటపర్వము- | 1428 | (14) అశ్వమేధపర్వము- | 980 |
| (5) ఉద్యోగపర్వము- | 1564 | (15) ఆశ్రమవాసపర్వము- | 364 |
| (6) భీష్మపర్వము- | 1173 | (16) మౌసలపర్వము- | 227 |
| (7) ద్రోణపర్వము- | 1865 | (17) మహాప్రస్థానికపర్వము- | 80 |
| (8) కర్ణపర్వము- | 1124 | (18) స్వర్గారోహణపర్వము- | 98 |

వాక్రుత్కు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు ...

కాశీఖండము.

తే. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి
రాజశేఖరుఁ గవిరాజుఁ బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యుని దిక్కయజ్వ
శంభుదాసుని గర మర్థి సన్నుతించి.

శృంగారనైషధము.

2. అ ల్ల సా ని పె ద్ద న.

ఆ. వె. వ్యాసరచిత భారతామ్నాయమాంధ్రభా
షఁగ నొనర్చి జగతిఁ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్కనను గృతక్రతు శంభు
దాసు నెఱ్ఱ సుకవిఁ దలఁతు భక్తి.

మనుచరిత్ర.

3. పిం గ ళి సూ ర న్న.

ఉ. ఏమెడ నర్థగౌరవ స మృద్ధియు శబ్దవిశుద్ధియుం దిశా
పైె యనవద్యతం బఱగు నంధ్రవచస్థితి భారతంబు రా
మాయణమున్ వచించిన మహాత్ముల నాత్మఁదలంచెదం
గ్గేయుల నన్నపార్యునిని దిక్కసుధీమణి నెఱ్ఱ సత్కవి

రాఘవపాండవీయము.

చ. పలుకఁ దలంప దవ్వులగు భారత రామ కథార్థము ల్విభా
సిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్ర వా
క్సులలితశక్తి నందఱకు సుప్రథితంబులు చేసినట్టి ధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱసత్క
విన్. కళాపూర్ణోదయము.

4. మాదయ్యగారి మల్లన.

తే. సరస సంస్కృత పుష్పగుచ్ఛప్రభూత
మగు తెనుంగను నెత్తావి కఖిలదిశలఁ
దరుణ పవమానమగు కవిత్రయ విశేష
చతురవాచానిరూఢి కంజలి యొనర్తు.

రాజశేఖరచరిత్ర.

౫. నంది మల్లయ్య—ఘంట సింగయ్య.

తే. నన్నపాచార్యునకు వందనంబు చేసి
తిక్కయజ్వకు మ్రొక్కి కీర్తితము లైన
శంభుదాసుని వాగ్విలాసములు నెమ్మ
నంబులోపల నిలిపి శ్రీనాథుఁ బొగడి.

వరాహపురాణము.

౬. జక్కనకవి.

ఉ. ఈత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దనై
చిత్రి నరణ్యపర్వము నశేషము శ్రీనరసింహ రామ చా

రి(తములున్ బుధవ్రజగరిష్ఠత నెఱ్ఱయ శంభుదాసుఁ డా
చిత్రకవిత్వ వాగ్విభవజృంభితుఁ గొల్చెదభక్తియుక్తిలో ఉ.

విక్రమార్క చరిత్ర.

### * 7. కు మా ర ధూ ర్జ టి.

సీ. తనరు వాగనుశాసన నితాంతవిభవంబు
 ధరణి సురజ్యేష్ఠ సరణిఁ దెల్ప
తనమఘవత్ప్రౌఢి ఘనపుణ్యజనదాన
 కృతి నిరంతరసుఖస్థితి నెసంగ
తనప్రబంధాను బంధనిరూఢి సతతంబు
 నార్యాభిమత సువాక్యములు నెఱప
తనదు శ్రీనాథత్వమనుపమ నృపసభాం
 తర చిత్రరచనబంధురత మెఱయ
తే. నలరు నన్నపఁ దిక్కనార్యాంధ్రకవిని
నెఱ్ఱనామాత్యు నిషధరాజేంద్ర సుచరి
తాంధ్రకవన నవీనవాగమృతలీల
నతిశయించిన నెఱజాణ నభినుతించు.

ఇందుమతీపరిణయము.

---

* శైవకవులైన 'పాల్కురికి సోమనాథుఁడు, పిడుపర్తి బసవ
ధూర్జటి' మొదలగువారు 'స్మార్తు' లగుటచే నన్నయాదులను నుతింపలే
కాని కుమారధూర్జటి యేలనో నియమోల్లంఘన మొనర్చెను. అట్లే
కవులైన 'నన్నెచోడుఁడు, రంగనాథుఁడు, శ్రీకృష్ణదేవరాయలు'
లగువారును నితరకవులకు నమస్కరింపలేదు. అందు సాధారణప్ర

## 8 రఘునాథ భూపాలుఁడు.

ఉ. లక్షణలక్ష్యకోటి పది • లంబుగ మేటికవుల్ నుతింపఁగో
దక్షమ సంస్కృతాంధ్ర కవి•తాపదవిన్ మహికెక్కి శబ్దవై
చక్షణి మించు నన్నని వి•శారదుఁడై తగు తిక్కయజ్వ ఘా
లేక్షణ భక్తిశీలుఁడగు • నెఱ్ఱయప్రగ్గడనేఁ దలంచెదన్.

వాల్మీకి చరిత్ర.

పై మహాకవులవలెనె (1) హరిభట్ట (ఉత్తరనరసింహ పురాణము) (2) శేషము వేంకటపతి (తారాశశాంకవిజయము) (3) తరిగొండమల్లన (చంద్రభానుచరిత్ర) (4) కామేశ్వరకవి (సత్యభామాసాంత్వనము) మొదలగు మహాకవులెందరో, ఎఱ్ఱన మహాకవిని నుతించియున్నారు. ఆ నుతించుటలోఁ బెద్దనాది కవులు భారతాంధ్రీకర్తనుగానె చెప్పియున్నారు. ఇట్లుండ నిప్ప టివారిలోని కొందఱు 'ఎఱ్ఱన' భారతాంధ్రీకరణమునఁ బూర్తి కవి కాఁడనుట విచిత్రము—

ఇంతమాత్రమె కాదు. ఇప్పటివారిలోనె మఱికొందఱు ఎఱ్ఱనామాత్యునికిఁ బ్రతిస్పర్ధినిగా నిలువఁ బెట్టిన 'నాచన సోముని' పై నుడువఁబడిన మహాకవు లెవ్వరును స్మరింపకపోవుట మఱియొకవింత. 'నాచనసోముఁడు' విజయనగరసామ్రాజ్య

---

గుటచేఁ గాఁబోలు. కట్టా వరదరాజు, రఘునాథ భూపాలుఁడు మాత్ర ను దారిఁ దప్పిరి. శైవులవలెనె వైష్ణవము పుచ్చుకొనిన 'చిన్నన్న' మొదలగువారును వారి గురువులఁ దలఁచిరె కాని 'స్మార్త' కవులగు నన్న యాదులకు వందనముఁజేయ లేదు.

స్థాపకుఁడైన 'బుక్కభూపతి' చే గౌరవింపఁ బడిన మహా
మైనను విజయనగరసామ్రాజ్యమునఁ బేరుఁగన్న, పెద్దనాదు
లేల తలంపలేదో? విజయనగరకవులలో నొక్క పిల్లలమ
పినవీరభద్రుఁడు మాత్రము ఎఱ్ఱనతో నాచనసోముని గూ
యిట్లు నుతించియున్నాఁడు.

మ. కవులం బంకజగర్భసన్నిభుల వఙ్కాణింతు వల్మీకసం
భవునిన్ వ్యాసుని గాళిదాసుబిలహాణున్ బాణున్ మయూ
న్మకున్భవభూతిన్ శివభద్రు మల్హణునిఘుం టామాఘునిఁ
భారవిమానన్నయభట్టుఁదిక్కకవినెఱ్ఱాప్రగ్గడన్సోమునిన్

జైమినిభారతము.

రామరాజ భూషనుఁడు, వసుచరిత్రమున నెఱ్ఱాప్రగ్గడ
విడిచి 'నన్నయ, తిక్కన, శ్రీనాథ, సోమన, భాస్కరుల'
స్మరించెను. ఆస్మరించుట యతని కిష్టమగు శ్లేషాలంకారపో
ణమునకే యైనట్లు కాన్పించును.

ఎట్లైన సోమునికంటె నెఱ్ఱన్ననే మహాకవులు స్మరిం
ట యాతని భారతాంధ్రీకరణము నందలి గౌరవము చేతనే.

ఇఁక 'ఎఱ్ఱనమహాకవి' కవిత్వమును విమర్శించుట
బూర్వము ప్రాచీనాంధ్రభాషాపరిస్థితిని, ఎఱ్ఱన్నకు గురుస్థా
మైన 'నన్నయ, తిక్కన్నల' కవిత్వశైలిని గొంత ముచ్చటిం
వలసియున్నది. దానిఁ జూతము.

# ఆంధ్రులు - వారి భాష

ఆంధ్రులనువారు 'విశ్వామిత్ర' శాపహతులైన యాత ని సంతతివారేయని 'ఐతరేయబ్రాహ్మణము' చెప్పుచున్నది. ఆవిశ్వామిత్రుఁ డట్లు తన సంతతివారిని శపించుటకు హేతువు 'హరిశ్చంద్రుని' రాజసూయయాగమునఁ బశువుగా బంధింపఁబడి న 'శునశ్శేపుఁడు' అను ఋషిపుత్రుని విశ్వామిత్రుఁడు రక్షిం చుసందర్భమునఁ గల్గెనని యా యైతరేయ బ్రాహ్మణముననె స్పష్టముగా నున్నది. ♦ ఆగాథ నేఁటి 'అయోధ్యాపురి' పరిస రమునఁగాని, దానికి సమీపమునఁగాని జరిగినదని చెప్పవలయు ను. ఆయాంధ్రు లప్పటినుండి నీచవృత్తుల నవలంబించి, నానా దిశలకుఁ బోయి యుందురు. రామాయణములోని 'శునశ్శేపు ని' గాథఁజూడ నది యయోధ్యకుఁ బశ్చిమభాగమున నొక్క యెడ నైనట్లు కాన్పించును.

'తైత్తిరీయబ్రాహ్మణము' నందు * 'ఆందుఁడు, అను నొక జాతివాఁడు చెప్పఁబడియున్నాఁడు. ఆందుఁడన, రేవుల యందు, ఒకవిధమగు బల్లెము నుపయోగించి మత్స్యములఁ బ ట్టువాఁడని యర్థము కలదు. తైత్తిరీయబ్రాహ్మణము, ఉత్తర హిందూస్థానముననే యొక్కయెడ 'తిత్తిరి' యను ఋషిచే

---

♦ ఐతరేయబ్రాహ్మణము—7-3-4.

* తైత్తిరీయబ్రాహ్మణము—3-4.

ద్రష్టమైనది. కాన నాంధ్రుడును ఉత్తర భారతములోనివా
తైత్తిరీయబ్రాహ్మణమునఁ జెప్పఁబడిన యాంధుడే యైత
బ్రాహ్మణమున నాంధ్రుఁడుగా నుచ్చరింపఁ బడియున్న
డేమో? ◆

మనుస్మృతియందు 'ఆంధ్రుఁడు' అనువాఁడు 'అ
మున' జంతువులఁ జంపి జీవించువాఁడని కలదు. * మను
తిని బరిశోధించిన వా రాగ్రంథము 'గంగా, యమునా' న
నడుమ విరచింపఁబడెనందురు. కాన, మనువునకుఁ దే
యాంధ్రుఁడును, ఉత్తరభారతదేశవాసియే.

ఆంధ్రబ్రాహ్మణులలో నూటి కెనుబది మందివఱకు
స్తంబసూత్రికులై' యుండుటచే నాంధ్రబ్రాహ్మణుల మ
పురుషుఁడు 'ఆపస్తంబ మహర్షి' యే యని చారిత్రకులు
దురు. ఆపస్తంబుఁ డాంధ్రదేశీయుఁ డని కొందఱు తలఁచిరి
యది సరికాదు. 'యమునానది' నంటియున్న 'సాల్వ' దే

◆ వేదవాఙ్మయమున దేశకాలముల ననుసరించి శబ్దములయు
రణములలో భేదములుకలిగినవి 'అధర్వవేదము' నఁగల 'కుంతాపసూక్త
నందు 'కౌరవ్యుఁడు' అని చెప్పఁబడినవాఁడు. ఐతరేయబ్రాహ్మణ
'కౌరవ్యుఁడు' అని చెప్పఁబడుట యిందులకొక చిన్న నిదర్శనము.

* శ్లో. మత్స్యఘాతో నిషాదానాం, త్వష్టిస్త్వా యోగవస్యచ,
మేదాంధ్రచుంచు మద్గూనా, మారణ్య పశుహింసనం॥
మనుస్మృ

యాతని నివాసమై యున్నదని తెలియవచ్చుచున్నది. § ఇది కూడ నాంధ్రుఁ డుత్తరభారతీయుఁడే యనుటను ధ్రువపఱచు చున్నది.

పై కారణములచే నాంధ్రు లుత్తర భారతమునుండి యెప్పుడో యెట్లో భిన్నభిన్న సంఘములుగా నేఁటి యాంధ్రావనిఁ జేరియుందురని తెలియనగుచున్నది. ఆంధ్రజాతి యీప్రదేశము నకుఁ జేరకపూర్వము కూడ నొక 'కిరాతక' జాతియిట నివసించియు న్నది. అది యేదన,

ఇక్ష్వాకు వంశజుఁడైన 'దండుఁడు' అనువాఁ డొకకార ణముచేఁ దండ్రివలన వెడలఁగొట్టఁబడి, వింధ్యపర్వతపు దక్షి ణభాగమునఁ జేరి, యచటనుండిన కిరాతులను వశపఱచుకొని, 'మధుమంతము' అను పట్టణమును నిర్మించి పరిపాలింపుచు, గురు వగు 'శుక్రుని' కుమార్తె 'నరజ' యను నామెను గా మించి బలాత్కరించె ననియు, శుక్రుఁడందులకుఁ గోపించి, దం డుఁడు నాతని యనుయాయులు నశించునట్లు శపింప, ధూళివ

---

§ 'ఆపస్తంబుఁడు' తన గృహ్యసూత్రములయందు 'సీమంత' కర్మ విధిఁ జెప్పుచు, నితర గృహ్యసూత్రకర్తలు విధించని యొకమంత్రమును విధించియున్నాడు. అది, యమునానది నంటియుండిన 'సాల్వ' దేశమును దానికిఁ బ్రభువైన 'యాగంధరి' యను రాజును గూర్చియునై యున్నది. కా న నాపస్తంబుఁడు 'సాల్వ' దేశీయుఁడనియే స్పష్టమగుచున్నది.

చూ. ఆపస్తంబగృహ్యసూత్ర భాష్యము. చౌకాంబాసంస్కృతసీరీసు.

ర్షము కురిసి దండుఁడు నాతని సంబంధులగు కిరాతులు నశిం
నియు, కొందఱుమాత్ర మొక 'సరోవర'తీరముఁ జేరి బ్రతిక
యు,పిమ్మట రావణుఁడు శూర్పణఖకుఁ బదునాల్గువేలమంది
క్షసులతో ఖరాసురుఁ దోడిచ్చి యాదండకారణ్యము నాక్ర
పఁ బంచెననియు రామాయణోత్తర కాండమునఁగలదు.శ్రీరా
డా దండకారణ్యముఁ జేరునప్పటికి'ఆర్యర్షులు, ఖరాదిరాక్షసు
కబంధాది గంధర్వులు, వాలిసుగ్రీవాది వానరులు'నేఁడేది య
ధ్రదేశమనుకొను చుందుమో యట్టిదండకారణ్యమున నుం

మఱియు భారతయుద్ధానంతరమైన 'యాదవ' నా
మున మిగిలినవారిలో 'కృతవర్మ'పుత్రుని యర్జునుఁడు దక్షి
పథమున నుండిన 'మృత్తికావత' పురి కధిపతిఁ జేసినట్లు భా
మునఁ గలదు. ఆమృత్తికావతము నేఁటి 'ఓరుగల్లు' నఁటియు
'మట్టివాడ' యేమొ? కృతవర్మ భోజకులజుఁడు. భోజుల
నము లీయాంధ్రావనిఁ గొన్నికలవు. అందు, కర్నూలుజిల్లా
'మద్దకరి'అనుచోట భోజులశాసనము లున్నవి. తద్వంశజుల
చెప్పుకొనువారును నట నేఁడుకూడఁ గలరు.

'కాకతీయులు' భారతయుద్ధములోఁ బ్రసిద్ధి నొం
'త్రిగర్తలు' అనువారితోఁ జేరిన 'ఆయుధజీవికగణము'. *
రెపుడో, యెట్లో, యీయాంధ్రావనిఁ జేరిరి.

ఇట్లప్పుడప్పు డనేకరీతుల నీ యవనిం జేరినవా

* చూ. పాణిన్యష్టాధ్యాయి — దామన్యాదిగణము

ఆంధ్రులు, అను సంఘమువారు ప్రబలులగుటచే వారి యేలుఁ బడిలోఁ జేరినవా రందఱికి నాంధ్రసంజ్ఞ కలిగినది.

అట్టి యాంధ్రదేశమును, ఆంధ్రుల ప్రభుత్వమును, క్రీ.పూ. నాల్గవశతాబ్దముననే యుండినట్లు 'మెగస్తనీసు' అను గ్రీసుదేశీయుఁడు, నాఁటికాలమున మౌర్యచంద్రగుప్తునికడ రాయబారిగ నుండినపుడు వ్రాసిన యంశములవలనఁ దెలియనగుచున్నది. పిమ్మట 'అశోకుఁడు' కళింగాంధ్రముపై దండెత్తుటయు, మఱికొంతకాలమునకు 'సుశర్మ' యను నాంధ్రప్రభువు 'మగధ దేశ'మును గూడ స్వాధీనపఱచుకొని యేలుటయుఁ గలిగెనని, పురాణాదులవలనను, చరిత్రలవలనను దెలియనగుచున్నది.

పైరీతి నార్యావర్తమునుండి యపుడపుడు చేరిన యార్యుల యొక్క సంస్కృతము, దండాదులయొక్క ప్రాకృతము 'భోజ, కాకతీయా'దుల శౌరశేని, ఖరాదుల 'పైశాచి' (ప్రాచీనద్రావిడము) కాలాంతరముల మిళితమై, ఈ యాంధ్రావనిఁ జేరినవారిభాష ఆంధ్రమనియు, 'తెలుఁగు, లేక తెనుఁగు' అనియు పేరులు కలదైనది. 'తెనుఁగు, తెలుఁగు' అనుపేరులు 'త్రినగ, త్రిలింగ' శబ్దభవములని చెప్పుదురుగాని యింకను నది స్థిరమైన వ్యుత్పత్తి కలదిగాఁ గాన్పింపదు.

ఆంధ్రులు పశ్చిమభారతదేశమునుండియే, బయలు వెడలి గోదావరీ నది పుట్టినచోటునుండి, క్రమముగాఁ దూర్పుదిశకుఁ బ్రసరించిరి. అందువలననే ఆంధ్రప్రభువులకుఁ దొలుత గోదావరీ

తీరమునందలి 'ప్రతిష్ఠాన' పురము రాజధానియగుట కూ
గలిగినది. ఆయాంధ్రుల భాష 'ప్రాకృతము'; ఆ ప్రాచీనప్రా
కృతభాషయందే శాలివాహనుఁడు 'సప్తశతి' అను గ్రంథము
వ్రాసియున్నాఁడు. ఆసప్తశతి పుట్టకముందే నాఁటి యాంధ్ర
దేశమున వ్యాప్తమైన 'పైశాచి' భాషలో 'గుణాఢ్యుఁడు'
అనునాతఁడు 'కథాసరిత్సాగర' మను గ్రంథమును వ్రాసెను

మహారాష్ట్రదేశభాష ప్రాకృత మని 'దండి మహాకవి'
చెప్పియున్నాఁడు. * ఆప్రాకృతమును, అశోకుని పరిపాలనాకా
లమున, 'కళింగాంధ్రమునఁ' బ్రవేశించిన 'మాగధి'యు, ఆ
త్పూర్వమువనే దేశమున నుండిన పైశాచియును, కాకతీయాదు
లతో వచ్చిన శౌరసేనియు, నాంధ్రదేశమున సమ్మిళిత మగు
టచే 'అపభ్రంశ' మనుపేరితోఁ బ్రాచీనులచేఁ బిలువఁబడెను.
అందువలననే 'ఎలుకూచి బాలసరస్వతి' తన 'షడ్భాషావివరణము'

◆ పశ్చిమపు టిండియానుండి 'ఆంధ్రుల'ను వారు వచ్చునపుడు కొం
ద ఱట నిలిచి పోయి యుందురు. ఆజాతిజులే 'బెలూచి' స్థానమునకును, భా
రతదేశమునకును నడుమ స్థిరపడియుందురు. వారిభాష 'బ్రాహూయి' అను
పేరు గలదై యాంధ్రభాషకు సన్నిహితమగుచున్నది. ఈయంశము చేతో
'గ్రియర్సన్' దొరగారు తమ 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' అను పుస్తకమ
న, ద్రావిడ భాషా వంశ వృక్షముఁ జూపుచు 'ఆంధ్రము'నకు 'బ్రాహూయి'
సోదరి భాషగా నిరూపించుట కల్గినది.

* శ్లో. మహారాష్ట్ర శ్రయాంభాషాం। ప్రకృష్టాం ప్రాకృతం విదుః
దండీ

నందు * 'ఆభీర, ఆంధ్ర' దేశములలోఁ బుట్టిన భాష 'అపభ్రంశము' అని చెప్పియున్నాఁడు.

అపభ్రంశ శబ్దమునకు, 'అపశబ్దము' అని యర్థము. ఏ నియమములకును లోఁబడక నానాభాషల సాంకర్యముగల యాంధ్రమును 'అపభ్రంశము' అనియే ప్రాచీనులు తలఁచి యుందురు. పై వేర్వేఱు ప్రాకృతభాషలకు 'శాతవాహన' చక్రవర్తుల కాలమున 'వాల్మీకి' అనుఋషిచే నొకవ్యాకరణము వ్రాయఁబడెను. అదియే ప్రాకృత వ్యాకరణములకు మొదటిది.♦

పై 'యపభ్రంశ' భాషలో వ్రాయఁబడిన గ్రంథము లేవియుఁ గాన్పింపవు. గాని, ఆభాషకును నొకవిధమగు నియమమును 'వాల్మీకి' చూపియున్నాఁడు.†

మఱియు 'హేమచంద్రుఁడు, త్రివిక్రముఁడు' మొదలగు వారును, ప్రాకృతభాషపై వ్యాకరణములను రచించి యున్నారని 'విన్నకోట పెద్దన్న' చెప్పియున్నాఁడు. చూడుఁడు.

---

* శ్లో. ఆభీరాంధ్రాది జాంభాషా మపభ్రంశం విదుర్బుధాః ॥

షడ్భాషావివరణము.

♦ వాల్మీకి యొక్క ప్రాకృత సూత్రములలో 'శాతవాహన' శబ్దముఁ గూర్చి చర్చ యుండుటచేతను, 'సప్తశతి' యావ్యాకరణమునకులక్ష్యముగా నుండుట చేతను, అది శాలివాహనుని కాలముననే రచింపఁ బడెనని, తలఁపఁ బడుచున్నది.

† వాల్మీకి సూత్రములపై నాంధ్రదేశపు పండితులగు (1) చెరుకూరి లక్ష్మీధరుఁడు 'షడ్భాషా చంద్రిక' (2) అప్పయ్య దీక్షితులు 'ప్రాకృతమణి

గీ. విశ్రుతులు హేమచంద్రి త్రి • విక్రిమాదు
లొనరఁ జూపిరి ప్రాకృతం • బునకుఁ ద్రోవ
నంధ్రభాషయుఁ బ్రాకృతా • హ్వయమ కాన
వలయుఁ దల్లక్షణంబులు • వలయుఁ దెలియ.

కావ్యాలంకార చూడా

ఇపుడు 'హేమచంద్రుని' దేశీయనామావళియు, 'త్రి
క్రముని' వాల్మీక సూత్రవృత్తియుఁ బ్రచారమునఁ, గలవు.
దటు హేమచంద్రాదులు తెనుఁగునకు 'లక్షణము' వ్రాసి
న్నారని చెప్పు వాక్యమునకు, పెద్దన్న పద్యము 'అపవాద
యున్నది.

ప్రాకృతభాషలోను, దానితో సంబంధించిన 'పాలి'భా
లోను, బౌద్ధమతగ్రంథములు పెక్కులు వ్రాయఁబడి యున్న
'అశోకుని' యొక్కయు, వానివెనుక చక్రవర్తులైన 'ఆం
చక్రివర్తుల యొక్కయు శాసనము లాప్రాకృతభాషలోనె వ్రా
యఁబడియుండెను. ఆంధ్రదేశమున నాంధ్రచక్రవర్తుల పరిపాల
నంతరము తెనుఁగుదేశమునకు 'పల్లవు' లొక వైపునను, 'శా
కాయనులు' వేఱొక వైపునను బరిపాలకులైరి. వారును, ప్రా
తభాషలోనె వ్రాయించిన శాసనావళి కాన్పించును. శాలం
యనులలో 'విజయదేవవర్మ' అనువాని పరిపాలనమువ

దీపము' (3) ఎలకూచి బాలసరస్వతి 'షడ్భాషా వివరణము' అను వ్యాఖ్య
నములను రచించి యున్నారు.

(క్రీ. త 375) ప్రాకృతభాషలో వ్రాయఁబడిన శాసనములు లభించుచున్నవి.

రాజుల మతము ననుసరించి మతగ్రంథములు, రాజశాసనములు, మాఱుచుండును ' అశోకుఁడు, ఆంధ్రచక్రవర్తులు ' బౌద్ధులగుటచే బౌద్ధమతగ్రింథములుగల 'ప్రాకృతమే' శాసనములకును నెక్కినది. వైదికమతముఁ బ్రోత్సహించిన 'గుప్త' రాజుల పరిపాలనమున సంస్కృత మభివృద్ధి కాఁజొచ్చినది. సముద్రగుప్తుని యాంధ్రదేశదండయాత్రిచే నాంధ్రావనిలోని ప్రభువులును సంస్కృతమును బోషింపుచు నాభాషనే రాజభాషగా నంగీకరించి, దానియందే శాసనములను వ్రాయించినట్లు కాన్పించును. ఆకాల మించు మించు క్రీ. త. నాలవశతాబ్ద మధ్యమునుండి యైయున్నది.

ఆంధ్రదేశమును, శాలంకాయనరాజులకుఁ బిమ్మట బ్రాగ్భాగము నేలిన 'విష్ణుకుండినులు' కేవల వైదికమతపోషకులె కాక, తాము వేదముఁ జదివి* యశ్వమేధాది మహాయజ్ఞములఁ జేసియున్నారు. అందు 'మాధవవర్మ' పదునొకండశ్వమేధయాగములను, నరమేధయాగముఁగూడఁ జేసియున్నాఁడు. అందు వలననే వారిశాసనములు వైదికమత నిదానమగు సంస్కృత

---

* మాధవవర్మ 'పొలమూరు' శాసనమున ప్రతిగ్రహీతయగు 'శివశర్మ'ను గూర్చి చెప్పుచు నాతఁడు మాధవవర్మకు 'తైత్తిరికసబ్రహ్మచారి' అనఁగా-'కృష్ణయజుర్వేదము'ను దనతోఁ జదివినవాఁడు, అని చెప్పెను.

భాషలోనె రచింపఁబడినవి. విష్ణుకుండినవంశజుల వేఁగిరాజ్య
తరించినపిమ్మట వచ్చిన 'చాళుక్యులును' దమకూటస్థు
'పులికేశి' అశ్వమేధయాగముఁ జేసెనని చెప్పుకొనుటచే వ
ను, వైదికమతచిహ్నముగ సంస్కృతభాషలోనె, శాసనము
వ్రాయించిరి. పిమ్మట ఆంధ్రచోళులు, కాకతీయులు, రె
విజయనగరసమ్రాట్టులునుగూడ, వైదికమతావలంబకులగు
సంస్కృతభాషలోనె శాసనములఁ జేసిరి. కృష్ణదేవరా
మాత్రము వివిధభాషలలోను శాసనములఁ జేసియున్నాఁడు

కాని, చాళుక్యుల కాలములో రాజులు సంస్కృ
భాషలో శాసనములను వ్రాయించినను, వారి 'మాండలికు
దండనాయకులు, కొండఱుస్త్రీలు' స్వకాలమునందుండిన ద
ధ్రిభాషలోనె శాసనములను వ్రాయించుచుండిరి. ఇందు
'జయసింహుని' సేనానియగు 'ఎఱుంబోది' యనువాని 'విప్ప
శాసనము, చాళుక్యభీముని సేనానియగు 'పాండురంగని'
పురి శాసనము, రాజరాజనరేంద్రుని పుత్రిక నని చెప్పుకొ
శోమలయొక్క దాక్షారామశాసనము నిదర్శనములు.

ఇది సంస్కృతనాటకములలోని 'ఉత్తమపాత్రలు'
స్కృతమును వాడినట్లును, స్త్రీ, సేవకాదిపాత్రలు ప్రాకృ
షను వాడినట్లును నాఁటివారు శాసనములను వ్రాయించు
లోను ప్రవర్తించిరని తలంపవలసి యున్నది. నాఁటికా
తెలుఁగైనను, 'ద్రావిడ, కర్ణాటక, మహారాష్ట్రాది' దేశ

నంటిన యాంధ్రమండలములలో నాయాప్రాంత భాషల సంప ర్కముచే, బెక్కుమార్పుల నొందియున్నది. ప్రాకృతభాష లనఁ బడు నవియుఁ దాము ప్రవేశించిన దేశములవారి యుచ్చారణా పరిస్థితుల ననుసరించి పెక్కురూపములతో 'తత్సమ. తద్భవ, దేశ్య, గ్రామ్య' రూపముల నొందినవి. అందువలన, నేది యే భాషాజన్యమో తెలియకుండఁగఁ బోయినది. ఇందులకుఁ జిన్న నిదర్శనముగా 'శూరసేని' భాషనుండి తెనుఁగునఁ గలిసి, యవి 'వైకృతా'దులఁగా నిఘంటుకారులచే గ్రహింపఁబడిన కొన్నిపదములఁ జూపుచున్నాను.

| * శూరసేని | తెనుఁగు | శబ్దరత్నాకరకర్తయభిప్రాయము |
|---|---|---|
| తరగ | తరగ | వైకృతము |
| మిస | మిస | ... |
| దుంగ | దుంగ | ... |
| అయ్యొ,అంయ- | అయ్యొ | ... |
| వేసం | వేసము | ... |
| అంతియ | అంతియ, (అంతమాత్రము) | ... |
| దువారం | దువారము | ... |
| సుంణ | సున్న, (శూన్యము) | ... |
| దీవ | దివ్వె | ... |

* శూరసేనీపదములను జయదేవునియొక్క 'శూరసేని'ద్వితీయభాషగాఁ గల ప్రసన్నరాఘవ నాటకమునుండియు, లక్ష్మీధరుని 'షడ్భాషా చంద్రిక'నుండియు సేకరించితిని.

| | | |
|---|---|---|
| మది | మది | తద్భవము |
| సంతి | సత్తి, (శక్తి) | సంస్కృతభా |
| తావ | తావు | దేశ్యము |
| పుణం | పున్నెము | వైకృతము |
| బళా | బళా(ఆనందసూచకము) | హిందీ |
| ఠాణా | ఠాణా(అధికారిస్థానము) | హిందీ |
| మోడి | మోడి(పని) | దేశ్యము |

పై శూరసేనీశబ్దములను శబ్దరత్నాకరకర్త, 'వైకృ తద్భవ, తత్సమ, హిందీ' పదములనుగాఁ దలంచియున్నా ఇట్లే మనకుఁ దెలియని ప్రాకృత షట్కము లోని పదము లె మో యాంధ్రమునఁ జేరియున్నవి.

ఇప్పటివారు కొందఱు ఆర్యభాషలకును, ప్రాకృతభా షను భిన్నమైన ద్రావిడభాష యొకటి కల దని చెప్పుదు కాని, ఏది ద్రావిడభాషాకుటుంబమని చెప్పుదుగో, అట్టి 'ద్ర డాంధ్ర, కర్ణాట, మళయాళాది భాషలు ప్రాకృతషట్కము నివే యని ప్రాచీనులు చెప్పియున్నారు. 'దండి' పండితుని శ్యములఁ జూడుఁడు.

*మహారాష్ట్రము నాశ్రయించిన భాష శుద్ధమగు 'ప్రా తము' మగధదేశమునఁ బుట్టినది. 'మాగధి' శూరసేని దేశ

* శ్లో. మహారాష్ట్రాశ్రయాంభాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
శూరసే నోద్భవాభాషా శౌరసేనీతిగీయతే

జన్మించినది 'శూరసేని' పిశాచదేశములఁ బుట్టినది. 'పైశాచీ ద్వితయము' (పైశాచి, పైశాచిచూళిక) ఆభీరాదుల * వాక్యములు 'అపభ్రంశము.' పిశాచదేశములను బెద్ద లిట్లు నిర్దేశించినారు. ''పాండ్య, కేకయ, బాహ్లీక, సింహ, నేపాళ, కుంతల, సుధేష్ణ, ♦చోట, గాంధార, హైవకన్న దేశములు'' పిశాచదేశములు.

ద్రావిడము లనుకొను 'ఆంధ్ర, ద్రావిడ, చోళ, కుంతలాది' దేశములలోని ప్రాచీనభాషను, అపభ్రంశ మనియు, పైశాచీ ద్వితయ మనియుఁ బ్రాచీనుల తలంపు. ఎక్కడనో 'కేకయ, బాహ్లీక' దేశములలోని 'బ్రాహూయి' భాషకును మనయాంధ్రమునకును సంబంధము కలదని 'గ్రియర్సన్' దొరగారు తలఁచిన దానిని మనప్రాచీనులు పైశాచీద్వితయము లోనిదిగాఁ జెప్పినట్లు కాన్పించును. దాని నటుండనిచ్చి చాళుక్యుల కాలమునం

---

మగధోత్పన్నభాషాం తాం మాగధీం సంప్రచక్షతే
పిశాచదేశనియతం పైశాచీద్వితయం భవేత్
పిశాచ దేశాస్తు వృద్ధై రుక్తాః
''పాండ్య కేకయ బాహ్లీక సింహ నేపాళకుంతలాః
సుధేష్ణ చోట గాంధార హైవకన్నా జనాస్తథా,
ఏతే పిశాచదేశాస్స్యుః''........

* 'ఆభీరాంధ్రు' లని పాఠాంతరము.

♦ 'చోళ' యని పాఠాంతరము.

దాంధ్రిభాష యెట్లు పరిణతి నొందెనో, రెండుమూడు
ర్శనములఁ జూపుదును.

ప్రాచీనకాలమునం దుండిన 'అపభ్రంశ' భాష
యప్పటియాంధ్రులు "నదులకు, గ్రామములకు, గ్రామసీమ
కొన్నివృత్తులకు, కొందఱు మనుష్యులకు" దేశకాలానుసా
లగు పేరులఁ బెట్టుకొనియున్నారు.

ఇందులకు 'విష్ణుకుండిన మాధవవర్మ' యొక్క '
మూరు' శాసనములోని కొన్నియంశములఁ జూపెదను.

## మాధవవర్మపొలమూరుశాసనము.

* "స్వస్తి భగవచ్ఛ్రీ పర్వతస్వామిపాదానుధ్యాతస్య
ష్ణుకుండినస్య'.... శ్రీవిక్రమహర్షస్యసూనోః....శ్రీగోవిందవర్మ
ప్రియతనయః....క్రతుసహస్రయాజీ .... ఏకాదశాశ్వమేధావ
స్నానవిగతజగదేనస్కః....విద్వ ద్ద్విజ గురువృద్ధ తపస్వీ జన
యః మహారాజః శ్రీమాధవవర్మా . .. పరమబ్రహ్మణ్యో
పితృ పదానుధ్యాతః * 'జనాశ్రయమహారాజః' గుద్దవాడివిష
విషయమహత్తరా నధికారపురుషాంశ్చ ఇమమిత్థ మాజ్ఞాపయ

* 'జనాశ్రయమహారాజ' బిరుదము నొందిన యీ 'మాధవ'
కును 'మధురాపురి' నాకాలమున నేలు 'సుందరపాండ్య'నకును నేదే
సంబంధము కలదని, 'సుందరపాండ్య' కృతమగు 'నీతిద్విషష్టిక'
గ్రంథముఁ బ్రకటించిన బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రి గా రాపు
పీఠికలోఁ జర్చించియున్నారు.

అస్తి విదిత మస్తు వో యోఽస్మాభిః గుద్దవాడివిషయే 'దట్టాయ వారితీర' 'పులిబూంరు' నామగ్రామం 'మయేందవాటకీ' దక్షిణతః సీమాంత చతుర్భిర్తనంచ .... 'పూంగ్దిజిగీషయా' ప్రస్థితః గోదావరీ మతీతరన్ వేద వేదాంగ విదో 'రుద్రశర్మణో' నప్త్రే దామశర్మణః పుత్రాయ శివశర్మణే గౌతమసగోత్రాయ, కమ్మరాష్ట్రికుండుక వాస్తవ్యాయ తైత్తిరికసబ్రహ్మచారిణె వేదచతుష్టయ సమామ్నాతావదాతాననాయ; ........ఫాల్గునపౌర్ణమాస్యాం సోమ రాహుగ్రస్తనిమిత్తే జనాశ్రయః దత్వా సర్వకరపరిహారే ణాగ్ర హారీకృత్య సంప్రదత్తః. తదత్ర భవద్భి రన్యైశ్చ ధర్మాధి గతబుద్ధి భిః పరిపాలనీయః.... ఆజ్ఞప్తి రత్ర హస్తి కేశ,వీరకేశౌ' మహాంశ్చ....ఇత్యేవ ముభయగణో స్వీకృత్య పరిపాలయేత్॥........

పై శాసనములో మాధవవర్మ 'పూంగిది' గ్విజిగీషచే గోదావరిని దాఁటి ఫాల్గునపూర్ణిమనాఁడు రాహుగ్రస్తమగు చంద్రగ్రహణ సమయమున 'గుద్దవాడి' విషయమున 'మయేందవాటకి' కి దక్షిణమున 'దట్టాయవారి'తీరమునందలి 'పులిబూంరు' గ్రామమును అన్నివిధములగు పన్నులను దీసివేసి, 'కమ్మ రాష్ట్రము'లోని 'కుండక' వాస్తవ్యుఁడును, దనతో తైత్తిరీయ సబ్రహ్మచారియు, నగు శివశర్మకు దానమిచ్చి, విషయమునందలి మహత్తురులగువారిని 'హస్తి కేశ, వీరకేశు'లను,దానమును నెరవేర్ప నాజ్ఞ నిచ్చెను.

ఇందు నాఁటి దేశీయపదము లెట్లుండెనో చూడుఁడు.

'పూంగిదిక్కు' అనఁగా ప్రాగ్దిక్కు అని యర్థమగుచున్న పూంగి, ప్రాక్ శబ్దభవము 'గుద్దవాడివిషయము' అన తూర్పుగోదావరి జిల్లాలోని తూర్పుడెల్టా ప్రదేశము. 'గు వాడి' గోదావరి శబ్దమునకు పైశాచి రూపమో, అపభ్ర రూపమో యైయున్నది. 'గో', గు, గాను 'రి' డి,గాను మా యపభ్రంశమైనట్లు కాన్పించుచున్నది. ఈ 'గుద్దవాడి విష ము' మనకుఁ దెలిసినంతవఱకు మాధవవర్మ శాసనము మొ లు, క్రీ. త. 1202 సంవత్సరమున నిచ్చిన 'మల్లవిష్ణువర్ధ 'ఎఱుపల్లి' (రామచంద్రపురము తాలూకాలోని ఏరుపల్లి) సనకాలమువఱకుఁ గాన్పించుచున్నది. అది రెడ్డపరిపాలనము ఇంచుమించు క్రీ. త. పదునాల్గవ శతాబ్దమధ్యమునుండి ' మండల' సంజ్ఞతో మాఱినది. ఈగుద్దవాడివిషయమునే శ్రీన మహాకవి 'భీమఖండ' మని ప్రసిద్ధమగు భీమేశ్వరపురాణము వ్రాసియున్నాఁడు. దానికి సంస్కృతగ్రంథమును గలదు. ' స్కాందపురాణాంతర్గతమఁట ! ముద్రితమగు స్కాందపురా మున 'భీమఖండ' గాథలు లేవు.

ఇఁక దట్టాయవారి'తీర మనునది ఇటీవల 'తుల్యా' మైనది. అది గోదావరినదియొక్క శాఖానదిగాఁ బ్రవహించు నిపుడు 'కాకినాడకాలువ'గాఁ బ్రవ్వఁబడియున్నది. ఈతుల్యా మహాత్తునుగూర్చి పెక్కుగ్రంథములను రచించిన 'ఏనుఁగుల ణకవి'తుల్యామాత్మ్యము' అను నాలాశ్వాసముల గ్రంథము

జేసియున్నాఁడు. 'పులిబూంరు' నేఁడు 'పొలమూరు' అనుపేరు కలదై నది. పులిబూంరుకు సరిహద్దు గ్రామమగు 'మయేంద వాటకి' నేఁడు 'మహేంద్రవాడ' అనుపేరుగల గ్రామ మైనది. 'కమ్మరాష్ట్రము' గుంటూరుజిల్లాలోని 'కమ్మనాఁడు' అనుపేరు గలది. 'కుండక' మెద్దియో తెలియదు.

ఇవన్నియుఁ గాలాంతరమునఁ బొందిన జనుల యుచ్చారణభేదములచేతను, స్థలాభిమానమున జనులు వానిని మహత్తు కలవానినిగా భావించుటచేతను గలిగిన మార్పులు

ఈశాసనమున—'హస్తికోశ, వీరకోశ' గణములు విషయ పరిపాలక సంఘములుగాఁ గాన్పించును. ఆసంఘములు నేఁటి 'రివిన్యూ, పోలీసు' డిపార్టుమెంటులవంటివై యుండును.

ఈమాధవవర్మశాసనముతోనె లభించిన 'జయసింహ వల్లభుని' మఱియొక 'పొలుమూరు' శాసనమును గలదు. అది మాధవవర్మశాసనమునఁ బ్రతిగ్రహీత యగు 'శివశర్మ' యొక్క పుత్రుఁడగు 'రుద్రశర్మ'కు, పొలమూరునే మరల నగ్రహారముగా స్థిరపఱచిన యంశము లున్నవి. మాధవవర్మకును 'జయసింహవల్లభు'నకును 30, 40 సం॥ రములు మాత్రమె కాలభేద ముండును.

జయసింహవల్లభుని శాసనములో, మాధవవర్మశాసనములోని 'పూంగిదిక్కు' అనుశబ్దము లేదుగాని 'కుండక' శబ్ద

మునకు మాఱు 'అసనపుర' వాస్తవ్యుఁడు రుద్రవర్మయనికలఁ
తక్కిన దేశీయ పదములన్నియు సమానములే.

జయసింహవల్లభుని యనంతరమున వేఁగీదేశపరిపాల
డై 'ఆఱు' మాసములె పాలించి మృతినొందె ననఁబడు జయ
సింహ వల్లభుని సోదరుఁడు 'ఇంద్రవర్మ' యొక్క 'క్రొణ్ణ
గూరు' శాసనమున దేశీయపదము లెట్లుండెనో చూడుఁడు.

* ఇంద్రవర్మ శాసనము

స్వస్తిశ్రీ మతాం సకల భువనసంస్తూయమాన మాన
సగోత్రాణాం, హారీతీపుత్రాణాం, స్వామిమహాసేనపదానుధ్యాతా
కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం, భగవన్నారాయణవరప్రసాద
వరాహలాంఛ నేక్షణ క్షణ వశీకృతాశేష మహీభృతాం, అశ్వమే
భృథస్నాన పవిత్రీకృతఘానస శరీరాణాం, స్వయశో విషయీ
త్రైలోక్యానాం, చళుక్యానాం, కులమలంకృత్య, నిజజన్మనా వి
మానః. శ్రీ 'కీర్తివర్మ' మహారాజస్య నప్తా, శ్రీవిష్ణువర్ధన మ
రాజః, రణముఖగతరిపువిజయసముపలబ్ధ శ్రీవధూనివాసాయ
విపులవక్షస్థలస్య పుత్రః, శక్తిత్రయసమధిగత మహాఖ్యాతివి
త్రివర్గసేవానిపుణః, పురాణపురుషఇవ బహులోకస్తుతః, పుర

* ఈశాసన మిదివఱకెచ్చటను బ్రకటింపఁబడలేదు. దీని నొ
త్రుఁడు గుంటూరు మండలమున సంపాదించి నాకిచ్చియున్నాఁడు. మ
సుమ్యూజియమునకు దీని నిచ్చితిని ఇది యపూర్వమైన శాసనమని
కులు తలంచుచున్నారు.

రివ భూతగణప్రియః, ద్వితీయఇవ మకరధ్వజః, పంచమ ఇవ లోక పాలః, పృథాగ్రసుతఇవ సత్యసంధః,శరత్కాలఇవ కృతబంధుజీవో త్సవః, పూర్వాచలేంద్రఇవ మిత్రోదయానుకూలమహిమా, మహీ పతి మకుటతటఘటిత మహారత్నమరీచి మంజరీరంజిత చరణార వింద యుగళః, శ్రీంద్రవర్మమహారాజః. త్యాగధేన్వపరనామధేయః ఉదకపూర్వకం సర్వకర పరిహారోపేతం బ్రహ్మదాయీకృత్య, 'కొ ణ్డనూగూరు' నామగ్రామం ప్రాదాత్. తస్యగ్రామస్య దిగ్విభాగాః. ఉ త్తరతః 'ముజుణూరు' నామ గ్రామః, పూర్వతః 'పగునూరు'నామ గ్రామః, దక్షిణవిభాగవస్థితః 'చెఋపూరు' నామగ్రామః, పశ్చిమతః 'ఇర్చులి' నామగ్రామః, ఏతేషాంగ్రామాణాంమధ్యే నివసీకృతవాజ సనేయచరణస్య 'దుగ్గశర్మణః' బ్రహ్మవిహితకర్మనిరతస్య, ఇట్టి ఖూర్చ్ఛయనామధేయస్య పౌత్రాయ, అభిజనవిద్యావృత్తవతః, భార ద్వాజ సగోత్రస్య విష్ణుశర్మణః పుత్రాయ వేదవద్విప్రసంస్తూయ మానచరితాయ, 'చణ్డిశర్మణే' మాతాపిత్రో రాత్మనశ్చపుణ్యావాప్త యే, ఇతిచ భావినో రాజర్షీన్‌యథోపచార పురస్సరం సమ్మానయతి. ఆర్య '(హూం)? వళగగనతిలకభూత 'కొణ్డివర్మణా' మహారాజస్య సుత ఇంద్రవర్మణో నామధేయ విజ్ఞాపనయా, తస్యాజ్ఞప్తి రేవం "ఆలపాకబోళ్, నెప్పిలాళ్, సోమయాజులవెళ్లెక్కిబోళ్, మారట

---

బోళ్" అపిచ మోహా ల్లోభా ద్వా యః కశ్చి ద్విఘ్నకర్తాస పంచమ హాపాతకయుక్తో భవిష్యతి. ఇతిచ. వేదవ్యాసస్యశ్లోకశ్చాత్ర(నిఘ్న తో) భవతి. గోవిప్రబాలయోషిత్తపస్వినః యా గతి స్సా భవే ద్వృ త్తిం హరతి శాసనాంకితాం. 'షష్టిం వర్షసహస్రాణి స్వర్గే తిష్ఠతి భూ

మిహ్,ఆక్షేప్తా చానుమంతా చ తాన్యేవ నరకే వసేత్.బహుభి ర్వ
దత్తా బహు భిశ్చానుపాలితా. యస్యయస్య యదా భూమి స్తస్య
తదా ఫలం. ఇతి కనకరామలిఖితే శాసనే చతుష్టష్ట్యంశః.ఏతేషాం
ల్గాం కుల్లేకాంశః. చోడబోళ్ తృతీయాంశః*.

పైశాసనమునందలి సంస్కృతవాఙ్మయము సాలఁ
మును దీర్ఘసమాసయుక్తమునై, ఇంచుమించుగ నాకా
నని వ్రాయఁబడుచుండిన బాణమహాకవియొక్క 'కాదం
కావ్య సంబంధమగుగాలి, సోఁకినదానివలెఁ గాన్పించుచున్న

ఇందుండిన నాఁటిదేశీయపదములగు " (1) ఆల
బోళ్, (2) నెప్పిలాళ్, (3) సోమయాజుల వెల్లెక్కబోళ్, (
మారటబోళ్, (5) ప్రాల్మాంకుళ్, (6) చోడబోళ్." 
పదములు, దురవగాహముగా నున్నవి.

కాని పదాంతములందలి 'ళ' కారము కాలాంతర
'ప్రథమాబహువచన' రూపప్రత్యయ మగు లు వర్ణక మై
శాసనశోధకులకుఁ దెలియనగును. 'బోళ్ళ' పదము' పోల
అను పదముయొక్క ప్రాచీనరూపముగాఁ గాన్పించుచున్న
ఆ పదజాలము శాసనస్థధర్మమును వ్యర్థముచేసినవారికిఁ గల
పాపమును, దానిని స్థిరపఱచువారికిఁ గల్గుపుణ్యమును దెల

* ఈశాసనము నిచట వ్రాయుటలో మూలమునందలి వర్ణ
వ్రాయక, ఇపుడు మన ముచ్చరించుపద్ధతినే వ్రాసితిని. క్రిందగీ
పెట్టినభాగములను మాత్రము యథామాతృకగానె వ్రాసితిని.

నవిగా నున్నవి. 'సెప్పిలాళ్' అనునది 'నెరపినవారు' అని మాఱి నట్లు 'మల్లవిష్ణువర్ధనాదుల' శాసనములలోఁ గాన్పించును.

ఇందు దానప్రతిగృహీత యగు 'చండిశర్మ' యొక్క-పితామహుఁడు 'దుగ్గశర్మ' యనియు నాతఁడు 'ఇజ్జిభూర్బ్బ యఁడు' అను నామధేయము కలవాఁ డనియుఁ జెప్పఁబడెను. నిఘంటువులలో 'బోయ' శబ్దమునకు 'కిరాతుఁడు, పాలకీమో యువాఁడు' అని యర్థములు కలవు. ఈశాసనమునందలి 'ఇజ్జి భూర్బ్బయఁడు' వాజసనేయచరణుఁడు. అనఁగా, 'శుక్లయజు ర్వేదముఁ' జదివినవాఁడు. భారద్వాజసగోత్రికుఁడునై యుండు టచే నీతఁడు 'ప్రథమశాఖాబ్రాహ్మణుఁ డగుట నిశ్చయము. మఱియు 'ఇజ్జిభూర్బ్బయఁడు' బ్రహ్మవిహితకర్ముఁ డని చెప్పఁ బడినది ఇందువలన నాతఁడు బ్రాహ్మణుఁడె కాని 'బోయ, జాతివాఁడును, పాలకీ మోయువాఁడు' ను గాఁ డని స్పష్ట మగుచున్నది.

బోయశబ్దము 'గ్రామపురోహితుఁడు' అను నర్థమున హైదరాబాదు రాజ్యములోని కొన్నిపల్లెలలో వాడుకొనఁబ డుట కలదు. తూర్పుగోదావరీమండలమున నేఁడును పల్లెల యందు శూద్రులయిండ్లలో నగు 'పితృ' కర్మమునందు గ్రామ పురోహితున కిచ్చు 'ఆమదానము' ను 'బోజి' యని చెప్పఁబడు చున్నది. 'బోయి' కి (గ్రామపురోహితునకు) ఇచ్చు 'ఆమద్ర వ్యము' బోజిగా మాఱియుండును. శాసనమునందలి 'ఇజ్జిభూ

రోబ్బయఁడు' ఇట్లుళ్గా రను నొకగ్రామమునకుఁ బురోహి
డని తోఁచెడిని. *

శాసనపుతుదిని 'ఇతికనక రామలిఖితే శాసనే చ
ష్ట్యం శః' అని కలదు. శాసనలేఖకుని నామములు శాస
మున లిఖింపఁబడుట కిదియే ప్రారంభ మని తోఁచుచు
ఇంద్రవర్మశాసనమునకుఁ బూర్వమున నుండిన 'శాలంకా
విష్ణుకుండిన' రాజుల శాసనములలోఁ గాని, ఇంద్రవర్మయొ
'పెద్దతండ్రి, తండ్రి, అన్న' యగు 'రెండవపులికేసి,
విష్ణువర్ధన, జయసింహవల్లభు'ల శాసనములలోఁ గాని
సాంప్రదాయము కాన్పింపదు. పిమ్మట 'చాళుక్య, కాక
రెడ్డి'రాజుల శాసనములలో నీసాంప్రదాయ ముండుటయే
నేఁడును, 'దస్తావేజు,నోటు' వ్రాయువారియొక్క పేరును '
వేజు, నోటు'లఁ దప్పక యుండవలయు ననువిధి యేర్పడి

శాసనములలోఁ గొంతభాగమె కాక, ఇంచుమిం
నమున కేఁబదియఱువదేండ్లకుఁ బిమ్మట నుద్భవించిన యొ
పూర్ణమగు చిన్న తెనుఁగుశాసనమును, నాఁటి వ్రాతశ
స్వరూపముఁ జూపుటకు వ్రాయుచున్నాను.

---

* పై 'బోయ' శబ్దము, దానప్రతిగ్రహీతలలో 'సర్వలో
యుని' 'చండలూరు' శాసనమునను గలదు. ఇంద్రకీలపర్వతశాసనమ
కోటిబోయ' శబ్దము కాన్పించుచున్నది. ఆశాసనములలో 'బోయ'
లకుఁ బూర్వముననున్న 'సంక్రి, త్రికోటి' మొదలగుశబ్దము
గ్రామనామములని తలంపవలసియున్నది.

## * పొట్లదుర్తి—మాలెపాడుశాసనము

(1) స్వస్తి (—) శ్రీ శోష్జమహారాజు ల్లొళన ఇన్ప్రెజ్ఞొలి
(2) అణపోతులు రేవణకాలు పుర్దణకాలు ఇచ్చిన ప
(3) న్నసపెన్నాఅ ఇళజేనికిన్ (—) తేని ఙచ్చినవాన్డు (ప)
(4) (ఇచ్చి) మహాపా(త)కున్డకున్ (—)
(5) అని వైరువులికితమ్. (—)

ఈశాసనమునందలి భాష కర్థము సులభసాధ్యము కాదు. ఇంకను నిట్టిశాసనములు పెక్కు లిపుడిపుడు లభించి, ప్రకటింపఁబడుచున్నవి. వానియందు మనయాంధ్రముయొక్క పరిణామము తెల్లముకాఁగలదు.

ఇట్లు నియమహీనమైనభాషనన్నయకుఁబూర్వమునూఱు నూట యేబదియేండ్లనాఁడు 'కర్ణాట' దేశీయుల సంపర్కముచే గేయములకు నుపయోగపడు 'ద్విపద, అక్కఱ, మధ్యాక్కఱ, సీసము, గీతము' మొదలగు ఛందోబద్ధరచనలుకలదై తెనుఁగుదేశమునఁ బ్రసరించి 'రాజసేనానులయొక్కయు, మాండలికులయొక్కయు' శాసనములలో మహారాజులయొక్క శాసనముల

---

* ఈశాసనమును బహుశాసనశోధకులు, నాకు మిత్రులునగు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ గారు ప్రకటించియున్నారు. ఈ శాసన కాలము క్రీ.త ఏడవ శతాబ్దమని వారితలంపు. ఎనిమిదవశతాబ్దమని కొందఱితలంపఁట! ఇంతకుముఁదు వ్రాయఁబడిన 'ఇంద్రిసర్మ' శాసనములోని దేశభాషకంటె నిది కొంచెము తేటగ నున్నదనుకొనుచున్నారు.

లోని సంస్కృతశ్లోకములకుఁ బ్రతిగా వ్రాయనారంభింపఁ
నది.

నాఁటిపదములలో గ్రామపురోహితుఁ డనునర్థమ
'బోయ'వంటి పదము లంతరించినవి. 'పులిబూంరు, మైండ
టకి' మొదలగుపదములు రూపాంతరము నొందినవి. ఇట్టియ
ధ్రభాషకు వ్యవస్థ యొకటి యవసర మయ్యె. ఇట్లుండ, శ్రీ
నకుఁ బిమ్మట పదునొకండవశతాబ్దారంభమున నాంధ్ర
పుణ్యవిశేషమున శ్రీశైలాది మహేంద్రగిరిపర్యంతము
త్రిలింగదేశమును రాజమహేంద్రపురాధీశుఁడై రాజరా
నరేంద్రుఁడు పరిపాలించుట కలిగెను.

రాజరాజనరేంద్రునకుఁ బూర్వ మీయాంధ్రావని,
రాజులదాడులచేతను, చాళుక్యుల యన్యోన్యకలహములచే
క్షోభించెను. రాజనరేంద్రుని తండ్రియగు'విమలాదిత్యుఁడు'
వంతులగుచోళులతో సంబంధ బాంధవ్యములు కలుపుటచే
ధ్రావనికి 'స్వచక్ర పరచక్ర' భీతులు పోయినవి. పదునొకం
శతాబ్దారంభమున, భరతఖండోత్తరభాగమునందు 'గజనీమహ
మదు' వలన నుపద్రవములు సంభవించినను, నాఁటిభారతీ
లా మ్లేచ్ఛులకు భరతఖండమునం దొక్క యంగుళముమేర
నను దక్కనీయ రైరి. యావద్భరతఖండమునందును విజ్ఞాన
యువులు వీచెను. 'భోజ, కైయట, మమ్మట, క్షేమేంద్ర, బిల్హ
హారదత్త విజ్ఞానేశ్వర, హేమచంద్ర, సోమదేవ' ప్రముఖులగుమహ

కవులు సంస్కృతభాషయం దీపదునొకండవ శతాబ్దమధ్యముననే యమూల్యగ్రంథములను రచించిరి. అందు 'భోజుఁడు, క్షేమేంద్రుఁడు, మమ్మటుఁడు' కావ్యవ్యవస్థఁగూర్చిన యైదలంకార గ్రంథములనురచించిరి. *క్షేమేంద్రుని'ఔచిత్యవిచారచర్చ'అనుగ్రంథము అలంకారశాస్త్రవిపుల కమూల్యమైనది. భోజుని సంస్కృత భాషాపోషణము జగద్విదితము. అందుకై క్రింది రెండు చిన్నకథ లుదాహరింపఁ దగియున్నవి.

భోజుఁ డిట్లు శాసించెనఁట !

♦బ్రాహ్మణుఁడైనను విద్యనేర్వనివాఁడైనచో, నాపట్టణమునకు వెలుపలనుండవలయును. కుమ్మరి యైనను విద్వాంసుఁడైనవాఁడు నాపట్టణమున నివసింపవచ్చును." అని.

(1) ఇట్లుండ నొకప్పుడు అపరాధశోధకులు, 'సాలె'వాని నొకనిని, నీవు మూఢుఁడవుగాన నగరమున నుండరాదని నిర్బంధింప, వాఁడు రాజసన్నిధికి వచ్చి ప్రభువా ! నాకు విద్యలేదని నన్నన్యాయముగా మీభటులు వెడలఁగొట్టుచున్నారన, భోజుఁడది విని నీకు విద్య కలదా? యన, వాఁడిట్లనెను.

---

*భోజుఁడు (1)సరస్వతీకంఠాభరణము (2)శృంగారప్రకాశము అను వానిని రచించెను. క్షేమేంద్రుఁడు (1)ఔచిత్య విచారచర్చ (2)కవికంఠాభరణము(3)సువృత్తతిలకము అనువానినిఁ జేసెను, మమ్మటుఁడు కావ్యప్రకాశముఁజేసెను.

♦శ్లో. విప్రోఽపియోభవే న్మూర్ఖః స పురాద్బహిరస్తు మే
కుంభకారోఽపి యో విద్వాన్ సతిష్ఠతు పురే మమ॥

శ్లో. కావ్యంకరోమి నహి చారుతరంకరోమి
యత్నాత్కరోమి యది చారుతరంకరోమి
భూపాలకాళి మణి మండితపాదపీఠ !
భోసాహసాంక ! కవయామి వయామి యామి !॥

తా॥ రాజులయొక్క కిరీటములయందలి మణులచే ప్రకాశించు పాదపీఠముగల మహారాజా ! ఓ సాహసాంక ! కావ్యముఁ జేయఁగలను. కాని యది యంతగా బాగుండదు ప్రయత్నించి చేసితినేని బాగుగఁ జేయఁగలను. నేను, కావ్యము మును జెప్పఁగలను. నేయఁగలను. (నీకిష్టములేనియెడల) పోవుచున్నాను.

అనియత్యద్భుతరీతిని సాలెవాఁడు శ్లోకరూపకముగాఁ బ్రత్యుత్తర మీయ భోజుఁ డానందించి వానిని బహూకరించి పంపెనఁట.

(2)మఱియొకప్పుడు భోజమహారాజు వేఁటకువెళ్లి వచ్చుచుండ పాలకిమోయు బోయివాఁడు భుజముపైనుండిన బొంగు నేదియొ బాధచే హెచ్చు తగ్గుగఁ బట్టుచుండెను. భోజుఁడు చూచి సంస్కృతభాషలోనె

*శ్లో. అయ మాందోళికాదండో తవబాధతి కిం భుజే
(ఈపాలకిబొంగు నీభుజమును బాధించుచున్నదా?)
అనఁగా బోయివాఁడు—

---

*ఈశ్లోకము కొంచెము భేదముతో 'ప్రకాశవస్తుని రసార్ణవాకరము' అను గ్రంథమున నపశబ్దప్రయోగమున కుదాహరణముగాఁ జెప్పఁబడెను, దీని నట భోజుని సంబంధమైనదిగా నె సూచింపఁబడెను,

శ్లో. నాయ మాందోళికాదండో తవ బాధతి బాధతే॥
(ఈపాలకీబొంగు బాధించుట లేదుగాని నీ 'బాధతి' యను తప్పు ప్రయోగమే నన్ను బాధించుచున్నది.)

అని శ్లోకమును బూర్తి చేయుచు 'ఆత్మనేపదముగా బాధతే' అని ప్రయోగింపఁదగిన క్రియను 'బాధతి' అని పరస్మైపదముగాఁ బ్రయోగించుటను తప్పుగాఁ జూపి యున్నాడఁట !

పైయంశములు నాఁటి సంస్కృత వాఙ్మయ మెట్లు మిన్ను ముట్టెనో చూపుటకై యుదాహరింపఁబడెను. ఆకాలముననే 'నన్నయ' భారతమునాంధ్రీకరించుచుండుటచే నా సంస్కృతపు గాలి నన్నయకవితకును దగిలినది.

మన రాజరాజనరేంద్రుని యాస్థానమునందును సంస్కృతపండితులు తక్కువగా లేరు.

◆"అపారశబ్దపారగులైన వైయాకరుణులును, భారతరామాయణాద్యనేకపురాణప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర రసభావ భాసుర నవార్థవచన రచనా విశారదులైన మహాకవులును, వివిధ తర్కవిగాహిత సమస్తశాస్త్రసాగర గరీయఃప్రతిభులైన తార్కికులును, నాదిగాఁగలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ"

ఇట్టి సమయమున రాజరాజనరేంద్రుఁడు దేశకాలపరిస్థితులఁ జూచెను. తన మాతామహుని దేశమగు ద్రవిడదేశ

◆ భా॥ ఆ. 1—8.

మున—ద్రవిడ వాఙ్మయమున, భక్తిజ్ఞాన వైరాగ్యాది
ములును, రసపోషకములు నగు పెక్కుగ్రంథము లదివఱకే
ద్భవించి వృద్ధినందుచుండుటఁ బరికించినాఁడు. జ్ఞాతు
కర్ణాటక దేశమున జైనమతోద్బోధకములై, రసవంతము
'విక్రమార్జునవిజయము' మొదలగు కావ్యములా దేశభాష
బుట్టుచుండుటఁ దెలిసికొనినాఁడు. కర్ణాటకుల సంపర్క
జైనమతము తెలుఁగుదేశమున వైదికమతమును తల
చేయునట్లు గాన్పించెను.

ఇట్లుండఁ దన యాంధ్రదేశమేల తోడిదేశములకుఁ
పోవలయును? విమతమునకేల చోటీయవలెను? ఇందు
నార్యమతబోధకమై, కావ్యరస స్ఫూర్తి కలదై, ధర్మాదు
బోధించునదియై, హృదయంగమ కథాసంవిధానముకలదై
వ్వొ గ్రంథము నాంధ్రభాషలో నేల వెలయింపరాదు? అని
రాజు తలఁచెను. అందుల కనుకూలుఁ డగు కవి కావలెను

ఆలోచింపఁగా, తన కులక్రమాగత పురోహితు
బ్రహ్మాండాది పురాణవేత్త, విపుల శబ్దశాసనుఁడు, సంస్
తాంధ్ర కావ్యరచనాపారీణుఁడు, బుద్ధివిశారదుఁడు, మ
ప్రతిభగలవాఁడు, అవిరళ జపహోమతత్పరుఁడు నగు నన్న
భట్టే యట్టి గ్రంథముఁ జేయఁదగినవాఁడుగఁ గాన్పించె
దాని కనుకూలముగా 'సంస్కృత, ప్రాకృత, కర్ణాట, పై
చి' భాషలఁ బండితుఁడై, కవియై, పశ్చిమ చాళుక్యుల

గొంతకాలము మంత్రియైన 'నారాయణభట్టు' అను మేధాశా
లి యేకారణముననో రాజనరేంద్రు నాస్థానమునకు రాఁగా,
రాజనరేంద్రుఁ డాతని నాదరించి 'నందమపూఁడి' యను నగ్ర
హారము నిచ్చెను. పై విధమగు సద్గ్రంథమును జేయింపు తలం
పును నన్నయాదులతోఁ జెప్పి యట్టి గ్రంథమేదని తర్కించప
నట్టిది భారతమే యని పండితులచే నిర్ణయింపఁబడెను. కారణ
మేమన—.

సీ. ధర్మతత్త్వజ్ఞులు • ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వే•దాంత మనియు
నీతి విచక్షణుల్ • నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహా • కావ్య మనియు
లాక్షణికులు సర్వ • లక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితి•హాస మనియుఁ
బరమ పౌరాణికుల్ • బహుపురాణసముచ్చ
యం బని మహిఁగొని • యాడుచుండ॥...

... ... ...

వ్యాసమహర్షిచే రచియింపఁబడుటయేగాక,

చ. హిమకరు దొట్టిపూరు భర•తేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁ•గా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమల• సద్గుణశోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సత•తంబు వినంగ నభీష్ట మెంతయున్.

అనెడి మహారాజుయొక్క యభీష్టముకూడ దాని
కూలమగుటచేతను, సంస్కృతభారతమునందలి కథను 'ధ
వేదాంత, నీతి, కావ్య, ఇతిహాసాద్యంశములు స్ఫుట
చుండ నారాయణభట్టు సహాయముతో నన్నయభట్టు
నాంధ్రీకరింప సిద్ధపడెను. కాని యాంధ్రమున కప్పటి
వ్యాకరణముగాని, లక్షణగ్రంథముగాని లేనందున
త వ్యాకరణముల ననుసరించి, దేశమున వాడుకలోనుండిన
క్తములగు పదములను సమకూర్చి, ద్రావిడభాషలోని
దాయములను వీలుకొలంది చేర్చి, కర్ణాటకభాషలోని
మును జాల స్వీకరించి, నాఁడు మిగుల వ్యాప్తిలోనుండిన
స్కృతభాషాసంబంధమునే విశేషముగఁ జేర్చి, నన్నయమ
కవి భారతము నాంధ్రీకరించెను.

నన్నయకుఁ బూర్వమునఁ దెనుఁగునఁ దప్పులతో
డిన శాసన పద్యావళివంటి స్వల్పగ్రంథములేకాని, మంచిగ్ర
ములేమియు లేనందునను, 'నన్నయ' గ్రంథరచనము 'సంస్
ద్రవిడ, కర్ణాటక' కవిత్వములకు భిన్నమగురీతిని రచించుటచే
నాతనిగ్రంథముపైఁ బెక్కుపెద్దవిమర్శనములు బయలుదేఱి
వివాదములలో నారాయణభట్టుతోడై నన్నయపక్షమునను
సమర్థించుట చేతనె నన్నయమహాకవి తనభారతములో, 'నా
యణభట్టు' భారతఘోరరణమున నారాయణుఁ డర్జునకుఁ

డినట్లు తనకు భారతాంధ్రీకరణములోఁ దోడ్పడె నని చెప్పియున్నాఁడు.

ఏదేని యొకకొ్రొత్త పద్ధతిని గ్రంథము వ్రాసిన నది పూర్వ పద్ధతికి వ్యతిరేకమని, తెలిసిన వారును, తెలియనివారును గూడ నవీనఫక్కిక, గల గ్రంథమునుదానినివ్రాసినవానిని ధిక్కరించుచుఁ దిరుగఁబాటుచేయుట లోకసామాన్యముగ నేఁటికిని గలదు.

నన్నయమహాకవి లోకజ్ఞుఁడు కావున, కర్ణాటకాదిభాషలలోవలెఁ దెనుఁగునను, సంస్కృతాంధ్రభాషామిశ్రమములగు-'అవసరపడి, భయపడి, అవమానపాటు భంగపాటు, నీకారణము, నీ తదర్థము, హంసపిండు, వాడిమయూఖముల్' మొదలగు మిశ్రమసమాసములను బెక్కింటిని దేశీయపదములతోఁ గలిపి తనభారతమునఁ జేర్చియున్నాఁడు. ఇటీవలి యాంధ్ర వైయాకరణులు కొంద ఱట్టి ప్రయోగములు తప్పు లని చెప్పుదురుగాని, నన్నయప్రయోగములే తెనుఁగు వ్యాకరణములను వ్రాయుటకు గతియగుచుండ, నాతనిప్రయోగములు తప్పనుటకు వీరికాధారమేమి ? పూర్వకవి ప్రయోగముల ననుసరించియే కదా వ్యాకరణము లేర్పడుట.

సంస్కృతవ్యాకరణ విరుద్ధముగ నన్నయ ప్రయోగించి, నది తప్పనవలయును. నన్నయ ప్రయోగములలో 'ముష్టాముష్టి ధారుణీశ'శబ్దములు, సంస్కృతవ్యాకరణదుష్టము లందురు.అందు

'ముష్టాముష్టి' ప్రయోగము నవీనవ్యాకరణజ్ఞుల మతము కా
యు, ప్రాచీనుల మతమనియు 'సిద్ధాంతకౌముదీ' వ్యాఖ్యా
యగు 'మనోరమాకర్త' వ్రాసియున్నాఁడు. 'ధారుణి' శబ్ద
మాత్రము నేఁటివఱ కెవ్వరును సాధువని సాధింపరైరి. క
కాళిదాసాదుల గ్రంథములలోను బెక్కు లున్నవి. అది తె
లోనిది కాదు.

---

# నన్నయభట్టమహాకవి

—:0:—

నన్నయమహాకవి గ్రంథకరణమునఁ దెనుఁగు వా
మార్గదర్శకుఁ డైనట్లే, కవిత్వధోరణికిని మార్గదర్శకుఁ డై
డు. ఆతనికవితాగమనము భావగంభీరయుక్తమై 'గంధగజ
నముఁ' బోలియుండును. అందువలననే, ఎఱ్ఱనామాత్యుఁ
నినాఁడు.

ఉ. ఉన్నతగోత్రసంభవము • నూర్జిత సత్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరి• భావి మదోత్కటము న్న రేంద్రః
జోన్నయనోచితంబు నయి•యొప్పెడు నన్నయభట్టకుం
బెన్న నిరంకుశోక్తిగతి • నెందును గ్రాలుటఁ బ్రస్తుతించె

అట్టి నన్నయ కవితావనిత యొక్క గమనమును రెండుమూ
ములచే దిక్ప్రదర్శనముగాఁ జూపెదను.

